చ. గురు కరుణాకటాక్షమునకుం దగి నేర్చినయట్టిరీతి నేఁ
బరమతపోనిధానులును బ్రహ్మసమానులు నైనమీకు మీ
కరుణనుగోరి చెప్పితిని గాని ఘనుండ నటంచుఁ గాదు నే
నరుదుగఁబల్కు నీచరితమందునఁ దప్పులయేని సైఁపుఁడీ. ౧౫౨.

మ. అని వాక్రుచ్చిన రౌమహర్షణి మునుల్ హర్షంబునం గాంచి పెం
పునఁ బీతాంబర కుండలాదులిడి సంపూజించి పంపంగ నా
ఘనుఁ డత్యంత కుతూహల ప్రథితహృత్కంజాతుఁడై తీర్థపాం
థునిఁ జిత్తంబున నెంచుచుం జనియెఁ దోడ్తోఁ దీర్థయాత్రారతిన్. ౧౫౩.

క. స్కందపురాణాంతర్గత, మిందుకళాధరుఁడు గౌరి కెఱిఁగించిన యీ
చందముఁ జదివిన వినినన్, సందేహము లేదు సర్వసౌఖ్యములబ్బున్. ౧౫౪.

శా. గ్రావోర్వీభమృగాంకసంఖ్యశకమాగన్ మన్మథాబ్దంబునం
దావిశ్వేశ్వరుసత్కృపాప్తిశరదృత్వంతర్గ్భవాష్ణాంబులం
దేవేళం బరికించి కృష్ణకవిరాజిత్కాశ్యపీ చక్రమం
దావిధ్వర్కముగాఁదగన్ సలిపె నౌరా! నాగరీ గ్రంథమున్. ౧౫౫.

ఆశ్వాసాంతము.

మ. ప్రతిమాతీతవిసర్జనాంచితుఁడు సుబ్రాయుం డతండిచ్చు పెం
పుతగ న్నాకౌక మెల్కుటుంబభరణంబుం జేయఁగాఁ జాలు శా
శ్వతభూదానమొసంగి సత్కృతి నిజైశ్వర్యం బవార్యంబుగా
క్షితిఁ జేయింపఁగఁ జేసి నీకొసఁగితిం జేకొమ్ము లోకేశ్వరా. ౧౫౬.

క. చందురునకునూలువోఁగను, చందంబున భక్తి నీకొసంగిన దీనిన్
డెందమున నెంచికొని పెం, పొందఁగ మముఁ బ్రోచియేలు మోహరమేశా. ౧౫౭.

మాలిని. నిరుపమగుణకోశా * నిత్యసత్యప్రకాశా
వరసురకలనాశా * వాసుదేవాద్యధీశా
పరిహృతభవపాశా * పాలితాత్మీయదేశా
నరసహృదయవేశా * సర్వలోకేశ్వరేశా. ౧౫౮.

గద్యము. ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్త్రి, సమారాధిత విబుధరాజశ్రీపాద, కృష్ణమూర్తికవిరాజప్రణీతంబైన కావేరీచరిత్రంబను మహాపురాణంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

---

# పీఠిక.

"కీర్తికాంతా స్వయంవరము" అనునీ చిన్ని పొత్తము, గోదావరీ మండలమునం దలి నరసాపురము కడనున్న గుడిమెళ్లలంక గ్రామవాసులు శ్రీమాన్ ఇయ్యాణ్ణి అనంతపద్మనాభ దేశికాచార్యులవారు, రాజమహేంద్రవరమునందున్న మాకలాశిక్షావ్యవస్థానమునకువిచ్చేసి, పురాతనప్రబంధ ప్రకటనాయత్తచిత్తులమగు మాకగపఱిచి, "ఈగ్రంథరత్నమున్ మీకలావతీ కంఠాభరణంబుగాఁ జేసికొనుఁ"డని యొసంగిరి. మేమువందన పూర్వకముగాఁ గైకొని దీని నామూలాగ్రముగఁ బఠించి, ఇట్టిచక్కని గ్రంథము మనకలావతిం బ్రచురించు భాగ్యంబు గలిగెఁగా యని పరమానందంబు బొంది యిట్లుపక్రమించితిమి.

ఇది మహీశూరపుర (మైసూర్) సంస్థానాధీశ్వరుండు శ్రీచామరాజాత్మజుండు శ్రీకృష్ణమహారాజుగారి పరమౌన్నత్యముం దెలుపు నుత్తమగ్రంథము. దీనిని తదాస్థానకవీశ్వరులెవ్వరో రచియించియుండవచ్చునుగాని గ్రంథకర్త నామమిందెచ్చటనుం గానరామి నిశ్చయించివ్రాయుటకు వీలుపడదయ్యె. గద్యమునం జూడరాదా, యన నదిమాకు లభించిన ప్రతిలో వ్రాయఁబడియుండలేదు. మేము మైసూరిగ్రంథవిషయమరయఁ గొందఱికి జాబులు వ్రాసితిమికాని, కారణమేమో ప్రత్యుత్తర మెక్కరేనీయలేదు, గ్రంథతత్త్వమంతయుం దెలియునంతవఱకు ముద్రింపకూరకుందుమో యన గ్రంథస్వారస్యంబునం గల చాపలంబునం బ్రచోదితులమై వేగిరించితిమని వేరచెప్పికొనవలయునా?

ఇందలికథ మనోహరమైనది.—త్యాగుఁడను రాజునకు సాహసలక్ష్మియను భార్యకలదు వారిద్వఱు సంతానకాంక్ష హిమవంతంబునకుఁబోయి తపంబొనరించునపుడు గౌరిప్రత్యక్షంబై వరంబొసంగె. అంతవారికిఁ గొంతకాలంబునకుఁ గృపయుం గీర్తియునను నిద్దఱు కొమార్తెలుపుట్టి దినదినప్రవర్ధమానలై యౌవన ప్రాదుర్భావసమయంబునఁ దండ్రియను మతిస్వయంవరంబునం బెండ్లియాడందలంచి కూడినరాజలోకంబులో లోకంబులలేనితమ యేర్పాటులకొడంబడని యెల్లరాజులనొల్లక, మహీశూర పురీశ్వరుండగు చామరాజకృష్ణభూపాలుని వరియించి వివాహముచేసికొనుట లోనగునది చక్కఁగవర్ణింపఁబడి యున్నయది.

శ్రీ

# కీర్తికాంతాస్వయంవరము

శా. శ్రీమచ్చంద్రకళావతంస, త్రిజగత్సింహాసనాసీన తే
జోమూర్తి, త్రితయాదికారణము, సంశుద్ధాత్మ, లోకైకసం
స్థానూలంబు, త్రయీస్వరూపిణియు నౌచాముండికాదేవి, తాఁ
బ్రేమం బ్రోచుతఁ జామరాజతనయుం గృష్ణరాజాగ్రణిన్.

సీ. కంటకిత్తునకు మొక్కలిరక్కసులు కాపురంబున్న యూళ్లు పారంబొసంగి
కలజగంబులఁ గాల్పఁ గడఁగినచేఁదు నేరటిపండుజాల్కఁ జేన్నని మెసంగి
జడలలో మినువాఁక చలువపాఁగామీఁద పాపజాబిలితురా పాదుకొలిపి
పాపయొమ్మొలకుఁ దోడ్పాటుగాఁ బెక్కండ్రు నలువలతలల పేరులను దాల్చి
మిత్తిఁదల మొత్తి సామేనసత్తి హత్తి
బుత్తిముత్తుల నీ సిడంబెత్తినట్టి
గిత్తతత్తడిమేటిరాహుత్తు ప్రోచుఁ
గాతఁ గృతిపతి శ్రీకృష్ణభూతలేంద్రు.

చ. సిరి యెదఁ గుల్కఁ బాల్కడలి శేషునిపైఁ బవళించి వేదముల్
పరమమునుల్ సురల్ వొగడ భక్తులపాలిటి కొంగుముల్లయై
పరఁగు సరోజనాభుఁడు కృపారస మొలుంచు చాంశసంభవున్
సిరులనొసంగి ప్రోవుతఁ బ్రసిద్ధయశోనిధిఁ గృష్ణభూవరున్.

చ భువనములన్ సృజింపఁగను బ్రోవఁగఁ ద్రుంపఁగఁ జాలుహంసతా
ర్క్ష్యవృషభరాజవాహులకు సాగిలి మ్రొక్కెడి సంస్కృతాంధ్రస
త్కవుల నుతించి కాకవులఁ గాదని యొక్క యపూర్వకావ్యముం
గవిజనచిత్తరంజకముగా నొనరించెద నేర్పు పెంపునన్.

తే. ఆర్యతోఁ గూడి యొక్కనాఁ డష్టమూర్తి
రాజతాస్యనగంబుపై రత్నపీఠిఁ

ప్రమథగణములు శ్రుతులు తాపసులు సురలు
బలసి సేవింపఁగా నిండుకొలువుదీరె. ౫

సీ. కాళీ శుభాసాంగ సాళీసుధాంబోధి కేళీవిహార మరాళ విభుఁడు
హాలాహలాభీల ఫాలాక్షి నిష్పన్న కీలావదగ్ధ ధనీకృతమదనుఁడు
సారంగధరకళా సారంగవరడింభ సారంగ సైతేయ చర్మధరుఁడు
స్వారాధనాగత స్వారాట్సరోజభూనారాయణాదినానామరుండు,
చారుమేరు శరాసనధారి త్రిపుర
హారి సాధుజనానందకారి భక్త
మానసవిహారి యామ్నాయ మార్గచారి
శంకరుఁడు నిండుకొలువున్న సమయమునను. ౬

తే. తుహినగిరికన్య గౌరీవధూటి మగని
వదనకమలంబుపైఁ దనవాలు చూపు
లళుల రీతినిముసరంగ నరసియిటులు
పలికెనంజలి యొనరించి భక్తి మీఱ. ౭

ఉ. దేవ,మహానుభావ, జగతీత్రయనాథ, భుజంగభూష, గం
గాధర, చంద్రచూడ, శితికంఠ, యజాచ్యుత ముఖ్యదేవసం
సేవిత, కాలకాల, మృదుశీల, మహేశ్వర, ఫాలనేత్రభూ
పావక, దగ్ధదర్పక, కృపాపర, శంకర,విష్ణువల్లభా. ౮

తే. ఆదిమధ్యాంతశూన్య, దేవామూర్తి నిజ
సవసవగ వింటి మున్ను నా[illegible]
గీర్తికాంతాస్వయంకీర్తి నాగ
నెవ్వతెయొ? దానితలిదండ్రులెవ్వరొక్కొ? ౯

క. ఎవ్వని వరియించెనొయా । జవ్వని, పూర్ణేందువదన, చంద్రవతంసా,
యవ్విధమువినఁగ నామన । మువ్విళులూరెడు ననుజ్ఞ యొసఁగుమి నాకున్. ౧౦

వ. దేవా, తదుదంతంబు సవిశేషంబుగ నీవలన వినంగోరెద దెలుపవేయని ప్రార్థించిన నందిగంధర్వుం డమందానంద కందళిత హృదయారవిందుండై, గిరినందనం గాంచి యిట్లనియె. ౧౧

గీ. ఆలకింపుము శర్వాణి, యరుణపాణి,
ముక్తినిశ్రేణి, మకరందపూరవాణి,
సైకతశ్రోణి, హామాగ్రజానిరాణి,
తెలిపెదను నీకునక్కథఁ దలిపడిగను ౧౨

వ. సావధానచిత్తమున నాకర్ణింపుమని యిట్లని చెప్పందొడంగె. ౧౩

చ. కలఁడొకరాజు, త్యాగుఁడనఁగా భువిఁబుట్టిననాటగోలెఁ గే
వలము జనానురంజకత వర్ధిలి, లోకహిత ప్రవర్తన
న్వెలఁగుచు నెల్లరుం దనను మేలన, సాహసలక్ష్మి నాఁగ ను
త్పలదళనేత్ర, సత్కులజఁ బాణిగృహీతగఁ బ్రీతిఁ గైకొనెన్. ౧౪

ఉ. సాహసలక్ష్మి, త్యాగుకనుసన్న మెలంగుచు నిత్యశౌరతో
త్సాహముఁగల్గఁజేయుచు, వశంవదగా నొనరించె, వారును
ద్వాహము నాఁటనుండి యెడఁబాయని కూర్మిరమింపుచుండిర
త్యాహిత పుత్రలాభకృతహర్షసముత్సుకమానసాబ్జులై. ౧౫

క. చిరకాలము త్యాగుండా । తరళాయత నయనతోడ దర్పకకేళీ
పరతంత్రత విహరించెను । సరసీరుహ పత్రనేత్ర, సంతతిలేమిన్. ౧౬

ఉ. సంతతిలేమి త్యాగుఁడును సాహసలక్ష్మియుఁ బెక్కువర్షముల్
చింతిలి, యేమి సేయుదమిసీ యనపత్యులమన్కియోత. జ
న్మాంతరమందునన్ జగన్నుతిమి పుత్రులుగల్గుభాగ్యమీ
పంతలఁగోరనేటికి; తపంబొనరింత మటంచు నెంతయున్. ౧౭

గీ. తలఁచి, సర్వస్వమగ్రజన్ములకు నొసఁగి,
తపము నొనరించి దాన సంతతినిఁ బడయు
కాంక్షను, తుసారగిరిచెంతఁ గానఁగోనఁ
జేరిరా దంపతులు శుభశీలురగుచు. ౧౮

చ. హిమగిరిచెంత, మున్ను జగదీశ్వరు శంకరుఁ గొల్చి యాడుదెం
దమునను శైలకన్యక వ్రతంబు లొనర్చిన యట్టిపావనా
శ్రమమును జేరి, త్యాగుఁడును సాహసలక్ష్మియు నిశ్చలాత్మతన్
దమమును శాంతిఁబూని, యతిదారుణమౌ తపమాచరింపఁగన్ ౧౯

క. వారలభాగ్యవశంబున । నారీమణి, గౌరియొక్క నాఁడు మగనిచేఁ
గూరిమి తలిదండ్రులఁగను । గోరికబొడముటను సెలవుఁగొని పఱతెంచెన్. ౨౦
క. జననీజనకులఁజూచెడు । మనమునశర్వాణి మంచుమలకుఁ జెలులతోఁ
జనుదెంచియొక్క నాఁడా । వనమున విహరించు వేడ్కఁ బర తెంచెఁదగన్. ౨౧
వ. వచ్చి, యయ్యాశ్రమంబు దరియంజేరి ౨౨
సీ. ఇదికదా తొల్లినే నీశ్వరారాధన సలిపినపావనాశ్రమతలంబు!
ఇవికదా మనము మున్నీశుని పూజకై విరులు గోయుచునుండు వృక్షతతులు!
ఇవికదా మనతోడ నెనసినర్తించిన చమరీగవయకృష్ణసారకములు!
ఇదికదా త్రిషవణం బేనాచరించెడు నములమైనట్టి పద్మాకరంబు?
ఇదికదా యీశ్వరుండు నాయెడనుకరుణ
నించి సాక్షాత్కరించిన నెలవటంచుఁ,
జెలిమి కత్తెలతోడుతఁ జెప్పికొనుచు,
వచ్చెఁ బద్మాకరముఁ జేరవారిజాక్షి- ౨౩
క. చను దెంచి, యందుమజ్జన, మొనరించెడు సాహసాఖ్య నుత్పలగంధిన్
గని, విస్మిత మానసయై, కనికరమున నిటులు శైలకన్యక బలికెన్ ౨౪
ఉ. ఎవ్వతెవీవు సారసదళేక్షణ, దారుణమైన కానలో
నివ్విధినొంటిఁ గ్రుమ్మరెద వేటికి? నెయ్యఁపుటల్కఁ బూనియో
పువ్విలుకానిఁ బాయురతి పోలికఁదోఁచెద వేమిగోరియో
జవ్వని, యవ్వనింతపము సల్పెదు నిక్కము దెల్పు, నాపుడున్- ౨౫
సీ. సాహసలక్ష్మి యాచందానఁదన సేమమారయు చున్నయా యార్యఁగాంచి
తనమది లోకమాతగనెంచి, భక్తివినమ్రయై, సాఁగివందన మొనర్చి
హర్షగద్గదిక నిట్లనియె నంజలియొగ్గి, తల్లి, నీకరుణ నేధన్యనైతి
జగదీశ్వరిని నీవు సాక్షాత్కరించుట ఫలియించె నాదు తపంబు నేఁడు-
త్యాగుఁడను రాజునకుఁ గళత్రంబ నేను
దంపతుల మనపత్యతఁ దపము సేయు
చున్న వారము దేవి,యీ యుగ్రవనినిఁ
దపము సిద్ధించె మేలుచేఁ దవిలెమాకు!- ౨౬

ఉ. ఇంకఁదపంబు సాలుజగదీశ్వరి, నిన్నుఁగనంగఁగల్గెని
శ్శంకఁద్వదీయ పాదపరిచర్య యొనర్చుచునుండు నంచునా
పంకరుహాక్షి గౌరి పదపద్మములంబడి సంప్రహృష్టరో
మాంకురయై, ప్రమోదనయనాంబువులం గడిగెం దదంఘ్రులన్, ౨౭

వ. మఱియుఁబునః పునః ప్రణామంబులాచరించుచు, దేవీ, నీవాదిమధ్యాంత శూన్యవు, పరంజ్యోతిస్స్వరూపిణివి, ఆదిశక్తివి, చరాచరాత్మకం బగులోకం బశేషంబునీవలన సృజింపంబడి, నీచేరక్షింపంబడుచు నీయంద లయంబందు. సృష్టిస్థితి సంహార కర్తలగుత్రిమూర్తులకు మూలకారణంబవు, చండముండ సంహారిణీ, చాముండీ, చండికా, హైమవతీ, దాక్షాయణీ, కాళీ, శివాది నానానామరూపంబులం బ్రవర్తిల్లుచు, విహరింపుచుందువు. నాపుణ్య విశేషంబున నన్ను ధన్యంజేయుతలంపున నిచ్చటికి విచ్చేసితివని, కరకమలంబులు మొగిడ్చి, నిలిచియున్న సమయంబున. ౨౮

గీ. ఆర్య, కనుఁగొంచి, యాసాహసాఖ్యుఁజూచి,
తపముసాలించి, పొందుమీ తావుఁజేర
మెచ్చితిని నీదుభక్తికి, మేలుగల్గు
నింకమీకని పల్కియ దృశ్యయయ్యె. ౨౯

ఉ. ఆగతిగౌరిచేవరము నందిన సాహసలక్ష్మినాథునిం
ద్యాగునిఁ జేరవచ్చి, ప్రమదంబునసాంజలియై, వినీతయై
సాఁగిలిమ్రొక్కి, పార్వతి యొసంగినయట్టి వరంబుఁ దెల్పినన్
రాగము మీఱఁగాఁ దనపురంబున కాతఁడుజాయతోఁజనెన్. ౩౦

గీ. ఈవచనంబున సాహసశ్రీకినంత
మాలునిలిచెను త్యాగభూపాలుఁడలర
నెలలుతొమ్మిదినిండ నన్నీరజాక్షి
కూఁతుఁగనుఁగొంచె నిరుపురగోర్కెఁదీర. ౩౧

సీ. అనుకంపమున నిడు కన్యకవారిలోఁబెద్ద, వరగుణరూప లావణ్యశీల
నవనీతమునఁ జేసె నాధాత్రియనియుగా దాపాదమస్తకం బమృతమయమొ
యనఁజగత్ప్రసిద్ధయైయొప్పె కంబవకూఁతురుకీర్తి నామమున మిగిలెఁ
దనుకాంతిపటిమ ముక్తాహార శారదాతారకా రోచియై తల్లిదండ్రు.

ల్లములఁ బొంగనంత నాయుత్పలాక్షు
లొయ్యనొయ్యన శైశవంబుజ్జగించి,
నెమ్మియౌవనదశ, తమ్ములనిక్క చూడ,
వృద్ధిఁబొందిరి బాలేందు రేఖలట్లు. 3౨

ఉ. శైశవముజ్జగించి యల చంద్రముఖుల్ నవయౌవనామృత
ప్రాశనఁ జేసినంతఁగను పట్టెను శిల్పము మేనులం, గళా
వేశముఁగ్రాల్గె మోముల, నవీనవిలాసము జగ్గునిగ్గుల
భ్యాశముఁజేరెఁ జూపరుల కద్భుతమావహిలంగ నయ్యెడన్. 33

చ. కనలదొకప్పుడున్, విరసగా దొకనాఁటికి నేని, ధూర్తవ
ర్తనమనరాదు, పల్కులసుధారస ముప్పతిలంగఁబల్కుఁ, జూ
పునవేడ్కఁ జల్లుఁ బ్రేమ, వినఁబోదు దురుక్తుల, బీదసాదలన్
గనిన వహించుజాలి, యనుకంప, గుణంబులకుప్ప యేమనన్. 3౪

సీ. ఆటలాడెదనన్న నవనీతలంబెంత, చౌకళింతు నటన్న జలధులెంత,
కుప్పళించెదనన్నఁ గుల భూధరములెంత, పఱచెదనన్న భూవలయమెంత,
శోధించెదనటన్న సురవిష్టపంబెంత, నిక్కి చూతునటన్న నింగియెంత,
అరసెదనన్న బ్రహ్మాండ భాండంబెంత, తిరిగివచ్చెదనన్న దిక్కులెంత,
యనుచు యౌవన కృతగర్వ మతిశయిల్లఁ
దన్ను వరియించు రాజగోత్రాత్రితలమున
వేడటంచును, నెవ్వారి లెక్కగొనక,
నమరనత్తఁగీర్తికన్యాలలామ. 3౫

వ. ఇట్లుదినదిన ప్రవర్ధమాన యౌవనలై, పెండిలికిం బట్టులైయున్న యనుకంపాకీర్తి సంజ్ఞలందనకూఁతులంగాంచి, త్యాగమహీనాథుండు, తననుగణాభి జన్యసౌందర్య చాతుర్యలావణ్యాతిశయులగు రాచకొమరుల నేర్పతింపంజాలక స్వయంవరమహోత్సవంబు చాటించిన, నానాదేశంబులనుండి రాజకుమారులు పఱతెంచి, పురంబు నపడిసిరంత. 3౬

సీ. త్యాగుండు పుత్రీస్వయంవరార్థంబుగా బఱతెంచినట్టి భూపాలసుతుల
సత్కారమొనరించి, శయనాసనాన్న పానాదులఁ దృప్తుల నాచరించి,

నగుటవీనికి నొప్పిదంబైనరాజ
నందనుని సేవరింతు నానందముగను. ౪౨

వ. అదియునుంగాక. ౪౩

చ. నను వరియించినట్టి నృపనందనుగాని వరింపదన్యనీ
వనజదళాక్షి సాధ్వి మ్మృగ భావమదగ్రజ సౌమ్యశీల వ
ర్తన యెడఁబాటు సైఁప దపరాధము సేయదు మేలు గూర్చుచు
న్మనమునొసంగు దీనినను మానముమాని వరింపఁగాఁదగున్. ౪౪

చ. కనలినఁ జేరరోయు, ననుకంపయ టందురు దీనిపేరు చె
ప్పనఁబరుషోక్తుల న్వినఁగ సైఁపదలంతిగఁ జూడరాదు చం
దనము మనంబు, పల్కులు సుధారసపూరము లిన్నెలంతి నీ
వనితవరించినట్టి నరపాలునిఁగాని వరింప నేనొరున్. ౪౫

తే. మనసునమెలంగు నిదియిట్టి మగువ పెండ్లి
యాడు రాజన్యుఁడే మాన్యుఁడగును జగతి
మఱియుఁ దెలిపెద నింకొక్క మాటగలదు
వినుఁడుఁ రాజన్యులార, నావిన్నపంబు. ౪౬

చ. కరగతుఁగాఁగఁ జేసి కొనఁగాఁదగు మజ్జనకుం బ్రివృద్ధుఁడ
త్పరిహృతిఁ జేయరాదు పరివాదమొనర్పఁగఁగూడ దాతనిం
గరుణను బ్రోవఁగాఁదగును గానియెడంద్యజియింతు నేను సు
స్థిరమతి నిత్యమాతని ద్యజింపని వానిభజించుచుండెదన్. ౪౭

తే. అదియె సాహస లక్ష్మి మాయంబ సర్వ
కృత్యములఁ దోడు పాటొనరింపఁగలది
సంపదకు మూలమీమె నాజనకుఁడొక్క
నిముసమెడబాసిన సహింప నేరఁడగుట. ౪౮

తే. వీడఁగారాదు వీరల విసువరాదు
ఆలఁతిచూపులఁ జూడరా దలుగరాదు
నను వరించిన రాజన్యునకును మాన్యు
లైన వీరల పోషణంబర్హ ముగును. ౪౯

క. నాయంబ సేని మఱిమాం, నాయగ్రజ సేని విడిన నాజనకుం డా
చాయను నిలువఁడు వెంటనె, పాయుదుఁగాయంబు నేను బార్థివులారా. ౫౦

వ. అగుట నిన్నింటికి నొడంబడిన రాజన్యకు మూరమూర్ధన్యుండు నన్నున్ వరియించు

గాతమని కీర్తికాంతావతంసంబు పలికి మిన్నకుండెనంత. ౫౧

ఉ. తొందిలిగాక మున్నెయిటు ప్రేలెదుభూపతు లింతలేసివా
రుండగలజ్జ వీడ్వడి దురుక్తుల నీజగజంతసేలుజా
ణుండిపుడున్న రాజకమునంగను పట్టెడు పొందటంచునో
క్కండు నృపాలసూనుఁడలుకన్ సరిరాజులతోడఁ బల్కెఁదాన్. ౫౨

వ. మఱియును. ౫౩

సీ. గయ్యాళి దీనితోఁగాదు కాపురమని మేదినీశుఁడొకండు మిన్నకుండె
జగములం దల్లాడుజాయ యేటికటంచు నవనీశుఁడొకఁడు మాటాడకుండె
జాత్రికాంతమగును సాహసలక్ష్మి పాత్రనిధారు ణీశ్వరుఁ డొక్కఁడూరకుండె
నీత్యాగు భరియింప నెవ్వఁడోఁపు నటంచు నెకిమీఁడొకండునో రెత్తకుండె.
నిందఁటికినన్న వస్త్రిము లిచ్చిధనము
పదడుగాఁజేసికొను పెండ్లిఫలముచాలు
చాలువలదని యొక్కభూపాలుఁడుండెఁ
గానివరియింతు ననువాఁడుగా నరాఁడు. ౫౪

చ. వినివిననట్లొకండు, కడుపేదురు జెందినయట్లొకండు, నొ
ప్పనిగతియొక్కఁడీ పెడఁగుపల్కుల కేమనియొక్కఁడిట్లు ల
జ్జను మొగమోడ జేసి తనచాయఁ గనుంగొన కున్న రాజులం
గనుగొని కీర్తికాంతయలుకం గడకం బలికెన్ సభాస్థలిన్. ౫౫

తే. అకట! మమ్ములవరియించు నట్టిహాఁడు
గలుగఁడాయెనె యీరాజకంబులోన
మెలఁగవలసె ననాథతే నిలనుమాకు
ననుచు నిట్టూర్పు నించియిట్లనియె మఱియు. ౫౬

తే. పౌరుషం బుజ్జగించి యీధారుణీశు
లూరకుండిరిగాని యిందొక్కఁడేని
నుగఁటిమివహించి మామీఁద మనసుపెట్టఁ
డాయె నిర్వీర్యమయ్యెఁ బో యవనితలము. ౫౭

ఉ. పౌరుషహీనులై తలలుపట్టుక పల్కఁగలేక మిన్నకు
న్నారలు వీరుపేదుక గనంబను జెంచిరకాని పెండ్లికై
రారిటువంటి షండలకురాఁబని యేమి స్వయంవరార్థమే
తీరుననిండ్లకేగుదురొకొ దీనతలన్వహియించి మోములన్. ౫౮

వ. అక్కటకటా! యతిభారంబులైన కిరీటాంగదాది భూషణంబులు దాల్చిన వీరువే షధారులుగా నొప్పుదురు, కానిరాజకుమారులుగా నొప్పరు, వంశంబులు వెలుపం బుట్టిరి నిక్కంబుగావీరు రాజన్యకుమారులేని స్వయంవరంబున మావంటిసత్కులాం గనామణుల నవామహామికల వరియింపకుందురే! ఇట్టివారల మహీపతులుగాఁబుట్టిం చినవిరించి నేమనందగునట్లుగుటంజేసి యేకదా! పద్మగర్భుండు పూజార్హుండుగాఁ డయ్యె. అనిపలికి నలుగడలు గలయఁగనుంగొనుచు నారాజలోకంబునకుందొలంగి ప్రత్యేకంబ సింహాసనాసీనుండైయున్న యొక్కభూపాలనందనుం గాంచెనంత.

క. పలుమరుఁ దనవంకంగని । జలిబిలినగవాననమునఁ జెన్నలరఁగ మీ
సలుగోట దీటుభూవర । తిలకుంగని కీర్తికాంత దలిపి వహించెన్. ౪౮

తే. చూచితలయూఁచి యీలోకసుందరుండె
మమ్ముఁవరియించునని యనుమానములను
దోఁచుచున్నది మిన్నక చూచునీవఁ
డేలొకో? యనిమదిసంశయించుచుండె. ౪౯

వ. ఆనృపాల నందనుండు. ౫౦

సీ. దుర్మదావనిపాలశర్మదాంతఃపురహాసజీమూతజంఝూనిలుండు
కడులేమిఁజెంది దిక్కడలి కుందెడువారి కడగండ్ల దయాళ్వాలవాలుఁబోలు
ముష్కరాభీరతురుష్కయావనముఖ్య వీరకాసారగంభీరవేట
కోదమజవ్వనపుటామొదవి షాక్కడు బోంట్లయుల్లంపు తోక్కంబుమల్లెవిడుపు
సకలరాజన్య మూర్ధన్య మకుటనికర
ఖచిత రుచిర ప్రచురరుచినిచ యనూత్న
రత్నదీప్తి ప్రదీప నీరాజితాంఘ్రి
సారసుండింపు మీఱును జామరాజు. ౫౧

ఉ. ప్రాక్తనరాజులంగలిచె భవ్యగుణంబులఁ జామరాజు
శ్శక్తిని దేవభూమి దివిషద్గురుభక్తి, ప్రజానురంజనా
సక్తి, బుధానురక్తిని సమాధు విరక్తియుతోసుశక్తి, స
ద్వ్యక్తిని లోకసత్పథనియుక్తి సుధానుతి రోక్తి నెంతయున్. ౫౨

మ. పటువాచారచనా చమత్కృతి గుబుంభర్తింపఁగాఁ జాలు, ను
ద్భటబాహాబల శక్తినవ్వడ ముడిన్ ధట్టింపఁగాఁజాలు, ను
త్కటతేజోగరిమ సహస్రకిరణుం దర్జింపఁగాఁజాలు, ని
ప్పటి రాజన్యులఁ జామరాజు సరిచెప్పన్ వచ్చు నే? యిప్పుడున్. ౫౩

ఆ. అతనిధర్మ పత్నియైన సాధ్వీమణి
కెంపనంజమాంబ యింపుమిగుల
జగతియదుకులంబు బొగడికకెక్కఁగాఁ
గృష్ణుఁబోలెఁగనియెఁ గృష్ణరాజు. ౬౪

సీ. ఏరాజునిరుపమోదారప్రతాపంబు వేసవిరవికిని వేడిచూపు
నేమండలేశు దాతృత్వవైశేష్యంబు శిబికర్ణబలులను సిగ్గుపఱచు
నేమహామహుని నిస్సీమయశోవళక్షత పండువెన్నెలఁ గడకుఁదఱుము
నేపార్థివేంద్రుని రూపవిలాసంబు తలిరుదూపులజోదు తప్పులెన్ను
నతఁడు వీరప్రతాప రాజాధిరాజ
రాజపరమేశ బిరుదవిరాజమాను
లైన రాజన్యులకు గండఁడనఁగఁబరఁగుఁ
జామరాజసుతుండు కృష్ణనృపవరుఁడు. ౬౫

సీ. కరుణారసంబొల్కఁగాఁ బల్కునేకాని పౌరుషం బెప్పాటఁబలుకఁబోఁడు
ఉపకారమునకుఁ దానుత్సహించునెకాని కలనైన నపకృతిదలఁపఁబోఁడు
ఇచ్చుచోనెంతైన నిచ్చుమాటయెకాని యింతయిచ్చితినంచు నెంచఁబోఁడు
పరులెచ్చుగానున్నఁ బ్రమదమొందునెకాని యొకనికెక్కికినీసునొందఁబోఁడు
వినయసౌజన్యధైర్య వివేకశౌర్య
సరసతౌదార్య గాంభీర్య చతురతాది
భావుకగుణంబులకు నాటపట్టుచామ
రాజతనయుండు శ్రీకృష్ణరాజమౌళి. ౬౬

చ. యదువులరాజ్యపాలన కనర్హులఁజేయు యయాతిశాప మ
య్యదుకులమందుఁబుట్టియు సమర్థుఁడనయ్యును మాన్యనైతి న
య్యదననటంచుఁ గృష్ణుఁడు మహాత్ముఁడు చామమహీశు పుత్రుఁడై
యదుకులమందుఁ గృష్ణుఁడను నాఖ్యజనించి ధరిత్రియేలెఁదాన్. ౬౭

వ. మఱియును,

సీ. కడగండ్లఁబడి గతిఁగనఁజాలవంచునాశాసామజముల నేస్తంబురోసి
యదుగంటిచేరఁబోముదుచు మొగంబని కమఠేంద్రు మీఁదిరాగంబువదలి
వాదమెత్తినను విషజ్వాలలువిని గుద్దుకని చెవుడని ఫణీంద్రువెడఁబాసి
నిలిచినచో ఝల్లఁగలచి దుమ్మెత్తునంచని ఘోణిమీఁది మోహంబువిడిచి
పృథివిలతనయరతఁజామరాజేంద్ర తనయుఁ

కృతసకలసాధుసంత్రాణుఁ గాంపనంజ
మాంబికాగర్భ శుక్తిముక్తాయమానుఁ
కృష్ణరాజ మహీంద్రు వరించి చేరె. ౧౯

సీ. కులగోత్రముల పెంపుదలఁపక మున్నిటు నుద్ధరించిన మేటి నుజ్జగించి
సార్వభౌమ ప్రేమ సంబంధముడిగి మహాభోగిభోగ సౌఖ్యంబు రోసి
తలమోచికొనియుండు ధవునికన్నడ జేసి యంజఁగొల్చిన వాలు నాసగడపి
యదువంశ వార్ధి రాకామృతదీధితి రాజన్యకోటీర రత్నకషణ
సంభవపరాగ శబలిత చరణపీఠు
రాజకంఠీరవునిఁ గృష్ణరాజచంద్రు
వలచి చేరినయట్టి పంటలవలంతి
కెక్కుడే తక్కు దొరలపై నేరగింత. ౨౦

సీ. అరదంబు కృంగి చేవరియున్న తఱిఁ బైరి సమయఁ జేసిన ధనంజయుఁడు దీటె
ప్రతినచెల్లింప నేరక సంగరమున శిష్యునకు లోఁగిన భృగుజుండు దీటె
యదలించి దాయపై సడరవెక్కొకింత జరిగిన జానకీజాని దీటె
మించెనాయపకీర్తి యంచుఁ దామాలువేషమునఁ బోరిన మహేశ్వరుఁడు దీటె
శాత్రవుఁడు పోరఁ గదసినసావిసాధ
నముల మఱచెడు భానునందనుఁడు దీటె
మొక్కపోవని యుక్కు పెంపెక్కు రాజు
రాజహంవీరుఁ డగు కృష్ణరాజునకును. ౨౧

సీ. స్వకృత దానార్జిత స్వవనీపకాఘ సద్దమ్మృతాంక్షో రాజరాజరాజు
స్వోపాత్త చాప విద్యాప్రాండితీ పూర్ణబలశిష్య పద్మన భార్గవుండు
స్వపరిభావ ఖ్యాపక పరిజాననిరీక్షణ వివర్ణిత రిపుస్వామిభుజుండు
స్వయశోభిమర్శన స్వపదాతపాథోధి జననహేతు శ్వేతవనజవైరి
స్వాప్రతిమదోః పరితాపాశ్రియాశ చటుల
హేతివిద్యోతఖద్యోత దినుఁడు చామ
రాజతనయుండు శ్రీకృష్ణరాజమౌళి
ధర్మమును భూమి నాల్గు పాదముల నిలిపె. ౨౨

సీ. ఆపద్గతవసుంధరాపాలురే తెంచఁ గోరి మించన యంత వారిఁ జేయు
సామాన్యయాచక జనసమూహమునకు లక్షలొసంగియు లజ్జఁ జెందు
నపరాధమొనరించినట్టి వారైన రా నేరంబులెన్నక గారవించు

మాద్యులైనను దసమునవుసొచ్చిరయేని వెరపుదీర్చి వారిఁగరుణఁజూచుఁ
గలియుగంబున శిష్టరక్షణముదుష్ట
శిక్షణము జేయ నిర్జరుల్ చేరి వేఁడ
నవతరించిన యారమాధవుఁడుగాక
రాజమాత్రుఁడె శ్రీకృష్ణరాజమౌళి. ౭౩

సీ. నాస్తివాదము జలచరాంగ్ర మత్స్యములంద మాలనీగుట త్రావిపూవులంద
కుటిలవర్తన భుజంగులయంద నేపట్టి వదలుట మల్లులకడనమంద
యరులఁగాంచిన నగ్రసమాట కార్ముకమంద ధౌర్త్యంబు సురతభేదంబులంద
రాగాతిశయత కీరముఖాగ్రములయంద వర్ణసంకృతి చిత్రపటములంద
పరభృతత్వంబు కోకిల పక్షులంద
కాని వేరొక్కచో నెందుఁ గాననీక
జగముపాలించెఁ గృష్ణరాజప్రభుండు
జనులు మెచ్చంగ జానకీజానిఁబోలి. ౭౪

వ. వెండియు సంభృతాఖండ మహీమండలతావితీర్ణ దిశాశుండాలకుండలీస్వేచ్ఛావి
హారవేదండ శుండాదండోపమోద్దండ నిజభుజాదండకుండలీకృతకోదండమార్తాండ
మండలహింసిత శిఖిశిఖాసమానవిశిఖనికర సంశోషితాశేషరోషభీషణ ద్వేషణ
జీవనుండును, సంతతాశాంత విశ్రుత విశ్రాణనోదంత సమాకర్ణనాక్రాంత ప్రీతి
తృణ నితాంతతాంతస్వమాన దురంత చింతాస్రూయమాణ మకరందబిందు సందో
హ కైతవజంజన్యమాన బాష్పాంబు పూరసిచ్యమాన నిజపాద సురపాదపప్రవరుం
డును, ఆశాకాంత కాంతాసీమంత కచకుచలలాటాధరకంఠ నితంబపాణితల ముక్తా
లలంతికా విచికలదామ పటీర చర్చామచర్చికా కర్పూరతిలక మందహాస తార
హార చీనాంశుకముకురాయమాన భాషాయోషాశేషాహి దోషాకర తౌషారగిరిశర్వ
పర్వత సుపర్వాశ్వ శారదా నీరద నారదపారద వలక్షతా విలక్షదయశోవిశాలుం
డును, స్ఫటికమణిమయాంగణ రంగప్రతిఫలిత నందనారామ మహీరుహకుసుమ
విసరమకరందపానలోలుపమధుపసమాగత చంచరీక సంచరమాణచంచరీఝంకారాను
మోదమాన నిరంతర ప్రవృత్త నాగరిక విపంచికాకల క్వాణనమిశ్రవశికుంతలీగాన రవం
బులగు భవ్యములగు హర్మ్యంబులును, మలయపవన ప్రసరణవిగళిత విచికలనూలతీ
వాసంతికాకుసుమంబుల ప్రసూనవితానంబు లారచితతల్పంబులుగా మధుమదఘూర్ణన
భ్రమద్భృంగీసుర ఝరుదుపహృతస్వచ్ఛ నానాలతాంత మకరందరసపూర్ణ చంద్రకాంతా
లవాలంబులు నాస్వాదితపానపాత్రంబులుగా సమ్మిళితహిమవాలుకా పరాగంబు

వ. అక్కటక్కటా! యతిభారంబులైన కిరీటాంగదాది భూషణంబులు దాల్చిన వీరువే
షధారులుగా నొప్పుదురు, కానిరాజకుమారులుగా నొప్పరు, వంశంబులు వెలుపం
బుట్టిరి నిక్కంబుగావీరు రాజన్యకుమారులేని స్వయంవరంబున మావంటిసత్కులాం
గనామణుల నహమహమికల వరియింపకుందురే! ఇట్టివారల మహీపతులుగాఁబుట్టిం
చినవిరించి నేమనందగునట్లగుటం జేసి యేకదా! పద్మగర్భుండు పూజార్హుండుగాఁ
డయ్యె. అనిపలికి నలుగడలు గలయఁగనుంగొనుచు నారాజలోకంబునకుం దొలంగి
ప్రత్యేకంబ సింహాసనాసీనుండైయున్న యొక్కభూపాలనందనుం గాంచెనంత. ౪౭

క. పలుమరుఁ దనవంకంగని । జలిబిలినగవాననమునఁ జెన్నలరఁగ మీ
సలుగొట దీటుభూవర । తిలకుంగని కీర్తికాంత దలిపి వహించి స్వకన్. ౪౮

తే. చూచితలయూఁచి యీలోకసుందరుండె
మమ్ము వరియించునని యనుమానములను
దోఁచుచున్నది మిన్నక చూచునీతఁ
డేలొకో? యనిమదిసంశయించుచుండె. ౪౯

వ. అన్నృపాల నందనుండు. ౫౦

సీ. దుర్మదావనిపాలశర్మదాంతఃపురహాసజీమూతజంఝానిలుండు
కడులేమిఁజెంది దిక్కెడలి కుందెడువారి కపగండ్ల దయావ్యాలకేట్లుఁబోవు
మహారాభీరతురుష్కయావనముఖ్య వీరకాసార గంభీరపేట
కోదమజవ్వనపుటాముదవి పాక్కడు బోంట్లయుల్లంపు ఆలోక్యంబు ముల్లవిడుపు
సకలరాజన్య మూర్ధన్య మకుటనికర
ఖచిత రుచిర ప్రచురరుచినిచయనూత్న
రత్నదీప్తి ప్రదీప నీరాజితాంఘ్రి
సారసుండింపు మీఱును జామరాజు. ౫౧

ఉ. ప్రాక్తనరాజులం గెలిచె భవ్యగుణుండగు జామరాజు తా
శ్శక్తిని దేవభూమి దివిషద్గురుభక్తి, ప్రజానురంజనా
సక్తి, బుధానురక్తిని సనాతన విరక్తి యశోనుషక్తి, స
ద్వ్యక్తిని లోకసత్ప్రథనియుక్తి సుధానుగ సూక్తి నెంతయున్. ౫౨

మ. పటుబాహారచనా చమత్కృతి గుబుంభద్దింపఁగాఁ జాలు, ను
ద్భటబాహాబల శక్తినవ్వడ ముడిన్ ధట్టింపఁగాఁజాలు, ను
త్కటతేజోగరిమ సహస్రకిరణుం దర్జింపఁగాఁజాలు, ని
ష్పటి రాజన్యులఁ జామరాజు సరిచెప్పన్ వచ్చునే! అప్పురిన్. ౫౩

చ. అటువలెఁ గృష్ణభూమిపతి యత్యనుకంపను గీర్తికాంత ను
త్కటముగఁ బ్రీతిఁ గైకొని యుదారగుణాంబుధి విప్రకోటి కెన్
నస్కటు గంయకాళితె ధనంబు నమేయముగా నొసంగి యం
తస్శిబిరంబు జేరి తన ధామముఁ జేరఁగ నేగె సేనతోన్. ౯౭

సీ. కటతట స్రోత దుత్కటదానగంధానుబంధానుయాయి పుష్పంధయములు
ఉత్క్రుష్టతుండా సముద్వాంత వమథునివారితార్యమ సైంధవ శ్రమములు
శ్రీరణానూరమయూరప్రియ పరస్పర సాతిస్ఫుటిత బర్హిముఖ పుష్కకములు
సాంద్రత్యక్తకర్కశస్కంధసంఘట్టన మస్పృణితాంభోవాహ మండలములు
బృంహితాపూర్ణకుహర దరీముఖములు
సాధ్వసధ్వాన దీర్ణదిశావ్రజములు
భద్రమంద్రముఖానేకవంశజములు
నడిచె నేనుంగుగములు గృష్ణనృపు మ్రోల. ౯౮

ఉ. అంచభోవాధినాథుని ఫణావలి గ్రుంగఁగ మ్రోల నశ్వముల్
మండలచంక్రమంబులు సమంజసలీల నొనర్చు వేళలం
జండఖురాంచలక్షతిరసాస్థలి విప్రియ్యలు వారనీ రట
న్నిండి సముద్రమయ్యె నవనీవలయంబును జుట్టువారగన్. ౯౯

చ. నడినెడమన్ రథాంగము లకుంఠగతిన్వడి మండలాకృతిన్
నడువఁగ దిచ్చునంటుఁగని నాఁడు మొదల్ రవి తేరు నట్లనే
నడపఁగఁగోరియబ్బెస మొనర్చుచునుండెనె కాని నేరఁడే
న్నడకల పక్షిణోరగయానంబులుఁ గాగను పట్టునిప్పుడున్. ౧౦౦

సీ. ఆము లేనుగులు పోరాడుచో నిరుగేలదుండముల్గ్రా నివారి దుడుదువాన్న
శార్దూలములు రెండు సరిపోర నెడసొచ్చి బాహుపోట్ల నెజము శాలికనుప
సైనిభంబుల రెంటి సరగ కొమ్ములు వట్టి తాకులాడించి చీకాకుజేయ
గరిపైకిలంఘించు కంఠీరవము నాగి యసియాడమిగఁ ద్రొబ్బిసటగట్టఁ
జగువమగటిమి నేనుపు దిట్టతనము
సాము సాధనములును దోశ్శక్తిగరిమ
గలుగు వీరభటుల్ రిపూత్కరము బెదర
నడిచి రప్పుడు కృష్ణభూనాథు మ్రోల. ౧౦౧

ఉ. అరజపుష్కటాదులయొయ్యారముటుండగ నిమ్మ గోటిసిం
గారమొకింత తారలకుఁ గల్గునె మోమునిగార మిందునం

శారయ మంగమూర్ధవమయూరి శిరీషసుమంబటంచు న
న్మారుఁడు మెచ్చుకోఁదగిన మంజులమూర్తులు వేశ్యలప్పుడిం
పారఁగఁ గ్రేవలన్నడిచి రన్నరనాథవరేణ్య మోసలన్. ౧౦౨

సీ. ననుఁగడగంటఁ గన్గొనె నేని నవనిధులిత్తునంచు గుబేరుఁ డెదురుచూడ
ముచ్చటించినఁజాలు మూల్లోకములయేలుబడియిత్తునని శచీపతి మెలంగ
నాటపాటల పరీక్షార్థంబు బిలుతురోయనుచు రంభాదులంతంతనీగ
తుంబురునారదాదులు విపంచ్యాది వాద్యములుమోయుచు వెంటనంటినడువ
సొలపు హొయలు విలాసంబు సోయగంబు
కులుకు తళుకును జగ్గు నిగ్గు గరువంబు
జూపులనయుట్టిపడ మహీశూరపురికి
నడిచె వేశ్యాజనంబు కృష్ణనృపుమ్రోల. ౧౦౩

వ. ఇట్లు మహావైభవంబునం బురంబుఁజేరి సుఖంబుండె ననిపలికి మహేశ్వరుండు జా
యం గాంచి యో ముద్దుగుమ్మా, యిదికీర్తికాంతా స్వయంవరోదంతంబు తెలుంగునీక
ఱింగించితినని మిన్నకున్న మిన్నేటిజడదాల్పుమున్నీనిం జూచి సర్వమంగళ యిట్ల
నియె. ౧౦౪

క. నాచరము చేజనించిన, పావనకన్యకల కేలువట్టిన యాభూ
క్ష్మీవరుని యింటనిలువం, గానలెమనకనుచు శైలకన్యక పలికెన్. ౧౦౫

ఆ. ఆవిధమునగౌరి యభవునొడంబడ
నాడిభర్తఁగూడి హర్షమునను
భవ్యమైన కృష్ణపార్థివేంద్రునివీట
నధివసించి పూజలందుచుండె. ౧౦౬

క. పరమేశ్వరుండు గౌరియుఁ
బరఁగెంచిన పాంతసిరియుఁ బద్మాక్షుండా
ధరణీధవువీట వసించిరి,
పరమానందప్రపూర్ణచేతను లగుచున్. ౧౦౭

సీ. అరగరాజకన్యక యొక్క నాఁటి వేకువవేళ నల్లనిత్రోవయు శంఖ
చక్రాంకుశములు పాశము తర్జనము ఖడియంబు శూలంబు కరాబ్జమున
నలరారఁగోటిమార్తాండతేజంబుచే దిశలు వెలుంగఁగ దివ్యభూష
ణములు దాల్చి మోమునంజిరునవ్వు వెన్నెలగాయఁ గన్నులనెనరువాలుక
నమరకామినులిద్దిగ్గజములు సరింప

మూర్తిమంతంబులై వేదములు నుతింప
సింహవాహనమెక్కి విచ్చేసినాదు
స్వప్నమునందోచె పుణ్యావశంబువలన. ౧౦౮

ఉ. ఏనుబిరానలేచి జగదీశ్వరికిం బ్రణమిల్లి భక్తిచే
నానతమూర్తినై భయము హర్షము నచ్చెరుపాటు వేడ్కయుం
మానసమందు దట్టి కొంకమాటయు బల్కగ వేగమూగచం
దానను దక్షత నూభవగాంచి యిట్లనెన్, ౧౦౯

తే. వత్స, నీపూర్వపుణ్యంబు వలననీకు
దర్శనంబిచ్చితిని నిన్ను ధన్యుఁజేయ
నేను జగదీశ్వరిని మదభీష్టమొకఁడు
దెలిపెదను నీకు నీవది దీర్పవలయు. ౧౧౦

క. కలఁడు మహీశూరపురో
జ్జ్వలరాజ్యరమావిభుండు చాముమహీభృ
త్తిలకుని పుత్త్రుఁడు మద్వర
ఫలమలఘుయశుండు కృష్ణపార్థివుఁడనఘా. ౧౧౧

గీ. అతనికిని గీర్తికాంతకు నైనపెండ్లి
తెలుఁగు గావ్యంబొనర్పుము తెలుఁగుభాష
ననుచు నిక్కథ తెలుఁగ్గల్ల నాజ్ఞయొసఁగి
దేవి లోకైకమాత యదృశ్యయయ్యె. ౧౧౨

తే. అంత మేలుగాంచి యక్కలయాఖ్యల
కెఱుకపఱుప వారలిది శుభంబు
గౌరిలోకమాఁత కరుణించెనీయెడ
దడయ కామె యాజ్ఞ నడుపుమనిరి. ౧౧౩

క, ఆపరమేశ్వరి యానతి
నాపార్థివునకును గీర్తికగు పెండిలిచా
వొప్పినయట్లు రచించితి
శ్రీపరమేశ్వరికిఁ బ్రీతిఁ జేసెదుగోర్కెన్. ౧౧౪

తే. కీర్తికన్యాస్వయంవర కీర్తనంబు, వినినఁ జదివిన వ్రాసిన మనుజులకును
ఆపదలు దొలంగు సకలసౌఖ్యంబులమరు, సంపదలుగల్గు వంశంబు సాఁగుచుండు. ౧౧౫

చ. యదుకులసార్వభౌమ, వదనాపహృతద్యుతిసోమ, పల్లవ
ప్రదరశతాభిరామ, జనరక్షణరామ, గుణాబ్ధిసీమ, దు
ర్మదరిపుభీమ, సర్వజనరంజననామ, ఖరాంశుధామ, యు
భ్యుదయపరంపరల్ గలుగుచుండుత మీకనుగృష్ణభూవరా. ౧౧౬

శా. సామంతక్షితిపాల సేవితపదాబ్జాతా, మహీశూరపూ
ర్ధామా, శ్రీవిజితేంద్రవైభవ భుజాదండోద్ధృతక్ష్మాతలా
చాముండాకరుణాఫలాయిత యదుక్ష్మాభృత్కులోత్తంస, ని
స్సీమప్రాభవ, చామదాజతనయా, శ్రీకృష్ణరాజాగ్రణీ. ౧౧౭

స్రగ్విణి. సర్వసర్వంసహా చక్రసంరక్షణా
ఖర్వభారోద్వహా కామినీకీరగం
ధర్వవీణాకళా నారదా సాహితీ
గీర్వధూటీవరా కృష్ణరాజాగ్రిణీ. ౧౧౮

గద్యము ... ... ... ... ... ...

సమాప్తము

రాజమహేంద్రవరము,—కళావతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

